Islami Tehzeeb (Telugu)

# ఇస్లామీయ సంస్కృతి

మూలం

మున్షీ ప్రేమ్‌చంద్

అనువాదం

అబ్దుర్రషీద్

అనంత కరుణామయుడు, అపార కృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో...

# ఇస్లామీయ సంస్కృతి

*ప్రఖ్యాత నవలా, కథా రచయిత మున్షీ ప్రేమ్‌చంద్ రాసిన వ్యాసానికి సంక్షిప్త రూపమిది. 1925 డిసెంబర్ 'ప్రతాప్' వారపత్రిక నుండి గ్రహింపబడింది. (ప్రకాశకులు)*

భారతదేశంలో హిందూ, ముస్లింలు గత వెయ్యి సంవత్సరాల నుండి కలిసి మెలిసి ఉంటున్నారు. కానీ ఇంతవరకు ఒకరినొకరు సరిగా అర్థం చేసుకోలేకపోయారు. హిందువులు ముస్లింలను కుట్రదారులుగా భావిస్తే ముస్లిములు హిందువులను ఆందోళనకారులుగా భావిస్తారు. ఇస్లాం వాస్తవాలను పరిశీలించే తీరిక హిందువులకు లేకపోగా, హిందూ ధర్మపు వాస్తవాల లోతుల్లోకి వెళ్ళే అవకాశం ముస్లిములకు లేదు. ఇరువురు పరస్పరం నిరాధారమైన విషయాలకు లోనై తలలు పట్టుకుంటున్నారు. చెడులన్నీ ముస్లిములలోనే ఉన్నాయని, వారిలో దయాదాక్షిణ్యాలుగానీ, ధర్మంగాని, ఉన్నత నైతికత గానీ సహనంగాని లేవని హిందువు భావిస్తే, హిందువులు రాళ్ళను పూజిస్తారని, మెడలో దారంవేసుకుంటారని, నొసటిపై రంగులు రుద్దుకుంటారని, పప్పన్నం తినే జీవులని ఒక ముస్లిం భావిస్తాడు. ఒకరి నీడ మరొకరిపై పడకుండా ఇరువురు తప్పుకుంటూ ఉంటారు. రెండు వర్గాల మత పెద్దలు పరస్పర వ్యతిరేకతే మతానికి నిదర్శనం అన్నంతగా బేధభావాలతో ఉంటారు. ఇక్కడ నేను హిందూ– ముస్లిము

లలోని అంతర్గత శతృత్వం గురించి మాట్లాడదలచ లేదు. "ఈ పరిస్థితులు తాత్కాలికమైననీ హిందూ ముస్లిములిరువురూ తమ తమ తప్పుల పట్ల పశ్చాత్తాపం చెందే రోజులు ఎంతో దూరంలో లేవనీ మానవత్వం, మంచితనంతో కాకపోయినా స్వీయ రక్షణ కోసమైనా ఐకమత్యం అవసరం అని భావించే రోజులు ముందున్నాయి" అని చెప్పిన మౌలానా షౌకత్ అలీ గారి అభిప్రాయంతో ఏకీభవిస్తున్నాను. ముస్లిముల సభ్యతా సంస్కారాల పట్ల హిందువుల అభిప్రాయంలో ఎంత వరకు న్యాయం ఉంది అనే విషయం మాత్రమే ఇక్కడ చెప్పదలిచాను.

## సభ్యతా సంస్కృతుల్లోని మూడు ఆదర్శాలు

ప్రాచీన కాలంలో ఏ జాతి ధార్మికత అయినా, అత్యున్నత ఆచరణాత్మక త్యాగమే ఆ జాతి సభ్యతా సంస్కారాలకు నిదర్శనంగా ఉండేది. చైనా, జపాన్, భారత్, ఈజిప్టు ఏ దేశ సభ్యతా సంస్కారాలను తీసుకున్నా అందులో మనకు మతం కనిపిస్తుంది. ఇప్పటికీ ఏ మతానికైనా ఇవే నిదర్శనాలు. అయితే పరిస్థితులు కొద్దిగా మార్చివేశాయి లేదా వాటి రూపురేఖలు మార్చివేయబడ్డాయని భావించాలి.

## ఫ్రాన్స్ విప్లవం

సంస్కృతి, నాగరికతలనేవి న్యాయం, ఐకమత్యం, సమానత్వంపై ఆధారపడి ఉంటాయి. కాస్తా పరిశీలించి చూసినట్లయితే ప్రాచీనతకు – ఆధునికతకు ఏమంత గొప్ప వ్యత్యాసం కానరాదు. అయితే మనం ఆధునిక సంస్కృతి గురించి చర్చిస్తున్నాము గనుక ఆధునికమే మన చర్చకు గీటురాయి. న్యాయం : ముందు మనం

న్యాయం గురించి చర్చిద్దాం. మనకు తెలిసి నంతవరకు న్యాయానికి ఇస్లాం ఎంతగా ప్రాధాన్యతనిచ్చిందో మరే మతమూ ఇవ్వలేదు.

క్రైస్తవ మతం దయా కారుణ్యాలకు ప్రాధాన్యతనిచ్చింది. దయా కారుణ్యాలలో చిన్నా, పెద్దా బలవంతులు, బలహీనులు, అగ్ర- నిమ్న అనే భావం ఇమిడి ఉంటుంది. అయితే ఎక్కడైతే న్యాయం ఉంటుందో అక్కడ ఈ తారతమ్యాలు ఉండవు. దయా దాక్షిణ్యాలనేవి కేవలం మానవు లకేకాక ఇతర సృష్టితాలకు కూడా సమానంగా వర్తిస్తాయి.

"హిందూ ధర్మం అహింసకు నిలువెత్తు నిదర్శనం. లోతుగా ఆలోచించినట్లయితే న్యాయం, అహింసా రెండూ ఒకటే. అహింస లేకుండా న్యాయం లేదు. న్యాయం లేకుండా అహింసను ఊహించ నైనా లేము. ముస్లింలు అన్యాయం చేశారని అనుకొందాం, మతం పేరుతో న్యాయాన్ని అణిచివేశారనుకొందాం. అయితే హిందువులు అహింసా వాదులై కూడా హింసను అవలంభించలేదా? బౌద్ధ, జైన మత రాజులు అహింసను ప్రత్యేక మత చిహ్నంగా భావించినప్పటికీ మతం పేరుతో రక్తపుటేరులు ప్రవహింపజేయలేదా? ఏ మత ఔన్నత్యా నికైనా వ్యక్తుల ఆచరణ ప్రామాణికం కాదు. చూడవలసిందేమిటంటే మత స్థాపకులు, మత పెద్దలు ఏమి బోధించారు అనేదే.

హజ్రత్ ముహమ్మద్(స)గారు ధర్మప్రచారకులను ఇతర దేశాలకు పంపిస్తూ 'ప్రజలు మిమ్మల్ని స్వర్గానికి తాళం చెవి ఏది అని అడిగితే దేవుని దాస్యం, చాటుమాటుగా చేసే దానం అని చెప్పండి' అంటూ ఉపదేశించారు.

అరఫాత్ పర్వతంపై నుండి హజ్రత్ ముహమ్మద్(స) ద్వారా వెలువడిన ముత్యాల మాటల వర్షం ఇస్లామీయ జీవన సరళికి ఊపిరి

పోస్తూ ఉంటుంది. ఆ రతనాల సందేశం ఆసాంతం న్యాయం. దాని లోని ఒక్కొక్క అక్షరం న్యాయం, న్యాయం అంటూ నినదిస్తోంది. ఆయన(స) ఇలా అన్నారు: ఓ విశ్వాసులారా! నా మాటను శ్రద్ధగా వినండి, అర్థం చేసుకోండి. విశ్వాసులందరూ పరస్పరం సోదరులని తెలుసుకోండి. మీరు ఒకే సంతతికి చెందినవారు. అతడు సంతోషంగా ఇవ్వనంతవరకు ఒక సోదరుని సొమ్ము మరొక సోదరునికి ధర్మ సమ్మతం కాజాలదు. అన్యాయం అస్సలు చేయకండి. దాని నుండి ఎల్లప్పుడూ దూరంగా ఉండండి.

ఈ సందేశంలో ఇస్లాం ఊపిరి ఉంది, ఇస్లాం పునాది న్యాయంపై నిలిచివుంది. రాజు, ఫకీరు, ధనవంతుడు, పేదవాడు అందరి కోసం అక్కడ న్యాయం ఉంది. ఎవరినీ ఉపేక్షించడం జరగదు. అన్యాయంగా ఎవరినీ బలపరచడమూ జరగవు. న్యాయం ద్వారానే బలహీనులు శక్తిమంతులపై విజయం సాధించిన సంఘట నలు కోకొల్లలుగా ఉన్నాయి. రాజులు తమ రాకుమారులనే కాక స్వయంగా తమ వ్యక్తిత్వాలను సైతం న్యాయం ముంగిట త్యాగం చేసిన సంఘటనలకు ఇస్లాంలో కొదువలేదు.

ప్రపంచంలో ఎలాంటి గౌరవనీయ జాతి న్యాయ నియమాల నైనా ఇస్లాంలోని న్యాయ నియమాలతో పోల్చితే ఇస్లాం మెరుగ్గా కనబడుతుంది. నిజానికి జాతులు క్షీణదశకు చేరుకున్నప్పుడు వాటిలో చెడు జనిస్తుంది. దీనికి హిందూ, ముస్లిం, క్రైస్తవ మతం ఏదీ అతీతం కాదు. ఈనాడు మనం ముస్లిములను ద్వేషం గలవారినిగా చూస్తు న్నాము. కాని కటక్ మొదలుకుని ట్యూనిషిష్ వరకు, టర్కీ నుంచి మొదలుకుని స్పెయిన్ వరకు ఇస్లాం పతాకం రెపరెపలాడినప్పుడు

అక్కడ ముస్లిం రాజులు ప్రదర్శించిన మత సామరస్యానికి సాటిలేదు. ప్రభుత్వంలో వారు ముస్లిమేతరులను గొప్ప గొప్ప పదవులలో నియమించడమైతే సాధారణ విషయం. క్రైస్తవులు, యూదులను ఇస్లామీయ యూనివర్సిటీలకు వైస్‌ఛాన్సలర్‌లుగా నియమించారు. ఈ పదవుల కోసం సామర్థ్యమే ప్రమాణంగా ఉండేది కాని మత ప్రసక్తి ఉండేది కాదు. ప్రతి విద్యాలయ గుమ్మంలో ఇలా రాయబడి ఉండేది. 'సమాజం కేవలం నాలుగు విషయాలపై ఆధారపడివుంది. 1. మేధావుల జ్ఞాన విచక్షణ 2. సమర్థుల అనుసరణ 3. యోధుల ధీరత్వం 4. బలవంతుల న్యాయశీలత.

## సమానత్వం

ఇక రెండో అంశం పరిశీలించి నట్లయితే ఇస్లాం సభ్యత సంస్కారాలు మిగతా సభ్యతా సంస్కారాలన్నింటి కంటే ఎంతో మెరుగని నిస్సందేహంగా చెప్పవచ్చు. కారల్‌మార్క్స్, రుసో సిద్ధాంతాల కన్నా మెరుగని చెప్పవచ్చు. నిజానికి ఈ సిద్ధాంత వ్యవస్థాపకుడు అరేబియా ఎడారి ప్రాంతంలో జన్మించిన ఒక నిరక్షరాస్యుడు, ఆయన పేరే ముహమ్మద్(స) ఈయన తప్ప ప్రపంచంలో మరే మత నాయకుడైనా దేవుని ముందు తప్ప మరెవరి ముందు కూడా తలవంచరాదని బోధించాడా? ఆయన స్థాపించిన సమాజంలో 'రాజు'కు ఎలాంటి ప్రాధాన్యతా ఉండేది కాదు. ప్రభుత్వం నడిపించటానికి ఒకే ఒక వ్యక్తిని గౌరవనీయులైన కొంతమంది కలిసి ఖలీఫా (రాజ్యాధినేత ప్రతినిధి)గా ఎన్నుకునే వారు. ఈ నియమానుసారం ఖలీఫా తనకంటూ ఓ ప్రత్యేకతను కల్పించుకో లేదు. ప్రవక్త(స) సైతం తమ అల్లుడైన హజ్రత్

అలీ(రజి)ను ఖలీఫాగా నియమించలేదు. ఆయన గనుక తలుచుకొని ఉంటే ఒకే ఒక్క సైగతో తన అల్లుడిని ఖలీఫాగా చేయగలిగేవారే కాని అలా చేయలేదు. ఆ ఖలీఫాకు జీతం గాని, పెన్షన్ గాని, ఎలాంటి జాగిరుగాని, ఎలాంటి మినహాయింపులు గాని ఉండేవి కావు. ఈ పదవి కేవలం గౌరవప్రదమైనదే. ఇతర ప్రజలలాగానే ఖలీఫా (పాలకుడు) కూడా కాయకష్టం చేయవలసిందే. అలాంటి మహావ్యక్తుల ముందు అతి పెద్ద రాజ్యాన్నేలే గొప్ప గొప్ప రాజులు సైతం తలలు వంచుకుని నిలుచుండేవారు. ఒక్క సంకేతంతో రాజులు పతనమవడమో గద్దెనెక్కడమో జరగిపోయేది. వారు చెప్పులు కుట్టి గాని, పుస్తకాలు రచించి గాని, పిల్లలకు చదువు చెప్పి గాని ఉపాధి సంపాదించుకునేవారు. ప్రభుత్వ ధనాగారం నుండి ఒక మామూలు సిపాయికి ఎంత జీతం లభించేదో పాలకుడయిన ఖలీఫాకు కూడా అంతే లభించేది. ఇంటికి అతిథి వస్తే వారి బాధ వర్ణనాతీతం. వారు స్వయంగా పస్తులుండ వలసి వచ్చేది. అవసరానికి ఇంట్లోని వస్తువులు అమ్ముకోవలసి వచ్చేది. అయినప్పటికీ తమ జీతాన్ని పెంచుకోవాలనే ఆలోచనకూడా వారికి వచ్చేది కాదు.

క్రైస్తవ మతంలో బైబిల్ చదివే అనుమతి పాస్టర్లకు తప్ప ఇతరులెవరికీ ఉండేది కాదు. హిందూ సమాజం కూడా శూద్రులను సృష్టించి తమ నుదుట కళంకం రుద్దుకుంది. కాని ఇస్లాంపై ఇలాంటి ఒక్క మరక కూడా కానరాదు. ఆనాడు ప్రపంచమంతటా బానిసల పరంపర కొనసాగేది. అయితే ఇస్లాం వారిపట్ల ప్రవర్తించిన తీరు చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడింది. ఇస్లాం స్వీకరించగానే బానిస స్వతంత్రుడయిపోయేవాడు. అంతేకాదు, తమ యజమానుల

తరువాత బానిసలు వారి పీఠాన్ని అలంకరించిన ఉదంతాలు కోకొల్లలుగా కనిపిస్తాయి. బానిసలు యజమాని కూతుళ్ళను వివాహం చేసుకునేవారు. ఇస్లాం సమాజం అణగారిన వర్గాల ముందు తన విశాల హృదయాన్ని ప్రదర్శించింది. వారి పట్ల ఎంతో సున్నితంగా వ్యవహరించింది. దానికి ప్రతిగా ఇతర సమాజాలలో అమానవీయత నాట్యం చేసింది. ఇస్లాం స్త్రీలకు ఆస్తి హక్కును ఎంతగా కలుగజేసిందో ఏ సమాజమూ అలా కలిగించలేక పోయింది. పైగా వారి తెలివి తేటలు, వారి ధనం విషయంలో సమ తుల్యం రాజ్యమేలింది. అది అలా సదా రాజ్యమేలుతూనే ఉంటుంది కూడా. ఇస్లాం తన అను యాయులలోని ఏ వర్గానికీ ప్రతిబంధకాల హద్దులు నిర్ణయించలేదు. అక్కడ ప్రతీ వ్యక్తి మేధా సంపదలలోనూ, సామాజికంగానూ ఎదగ వచ్చు. ఎలాంటి అవరోధాలు ఎదుర్కోవలసిన దుస్థితి కలగదు. ఏ సభ్యతా సంస్కారానికైనా గర్వపడే హక్కు అంటూ ఉందంటే అది వ్యక్తికి అత్యధిక అవకాశాలు కల్పించిన సంస్కృతిక ఉంటుంది. ఆవిధంగా చూసినా ఇస్లామీయ సభ్యతకు ఏ ఇతర సంస్కృతి సాటిరాదు.

## ఐకమత్యం

ఇక సంస్కృతిలోని ఐకమత్యం అనే మూడో భాగాన్ని తీసుకుంటే ఈ విషయంలోనూ ఇతర జాతులకంటే ఇస్లాం ఎంతమాత్రం వెనుకడి లేదు. హజ్రత్ ముహమ్మద్(స) ఇలా సెలవిచ్చారు. "ఏ వ్యక్తి అయినా తన కొరకు ఏది ఇష్టపడతాడో తన సోదరుని కోసం కూడా అదే ఇష్టపడనంత వరకు అతడు మోమిన్ (విశ్వాసి) కాజాలడు. మరొక చోట ఆయన ఇలా ప్రవచించారు: 'ఏ వ్యక్తి అయితే ఇతరులకు మేలు

చెయ్యడో అతని పట్ల దేవుడు సంతోషపడడు.' ఆయన గారి ఈ ప్రవచనం సువర్ణాక్షరాలతో లిఖించదగింది. 'దేవుని సృష్టితాలన్నీ ఆయన కుటుంబమే. ఏ వ్యక్తి అయితే దేవుని దాసులకు మేలు చేస్తాడో అతడే దేవుని దృష్టిలో గౌరవనీయుడు. ఒక ముస్లిం వ్యక్తి ఆయనను "దేవుని దాస్యం ఎలా చెయ్యాలి?" అని అడిగాడు. 'నీవు గనక దేవుని దాస్యం చేయాలఘుకుంటే ముందు ఆయన దాసులను ప్రేమించు' అని ప్రబోదించారు ఆ కారుణ్య మూర్తి(స). ఈ ప్రబోధనం ఇస్లాంలో ఐకమత్యానికి ఎంత ప్రాధాన్యత ఉందో చాటిచెబుతోంది.

ఇవి ఇస్లాంలోని సంస్కృతి సభ్యతల మౌలిక అంశాలు. ఇందులో రాజకీయ నిబంధనావళి, జ్ఞానసముపార్జన, స్వేచ్ఛ, నైపుణ్యత, నిర్మాణాలు వాటి రూపురేఖలు మొదలైనవన్నీ చేరి ఉన్నాయి.

వడ్డీ వ్యవస్థ ప్రపంచంలో ఎంతగా చెడులను జనింపజేసిందో ఇంకా జనింపజేస్తూనే ఉందో తెలియని విషయం కాదు. అయితే వడ్డీ నిషేధించిన ఏకైక ధర్మం ఇస్లాం మాత్రమే. ఇస్లాం వడ్డీని నిషేధించింది. వ్యాపారపరంగా దాని నిషేధాన్ని వ్యతిరేకించవచ్చు గాని, సామాజిక పరంగా ఎవరూ దాని నిషేధాన్ని బలపరచకుండా ఉండలేరు.

విద్యాజ్ఞానాల సముపార్జనలో కొన్ని జాతులు మాత్రమే సాటిగా నిలువగలవు. అయితే భారతదేశం నుంచి వైద్యం, గణితం, జ్యోతిష్యం, ఆధ్యాతికతను, ఈరాన్ నుంచి వేదాంతాన్ని, ప్రజాస్వామ్యాన్ని ఇంకా ఆణిముత్యం లాంటి విషయాలు ఎక్కడ నుండైనా ఏ విషయంలో లభించినా వాటిని ఇస్లాం చేతులు చాచి అందిపుచ్చుకుని తన సంస్కృతి లోని భాగంగా చేసుకుంది.

నిర్మాణ పనుల్లో ప్రపంచంలోని ఏ జాతి కూడా ముస్లింలతో సరితూగలేదు. ఎక్కడెక్కడయితే ఇస్లాం పతాకం రెపరెపలాడిందో అక్కడల్లా వారి కట్టడాలు ఇప్పటికీ వాటి నిర్మాణాలను, వారి అను యాయుల ప్రతిభను చాటుతూ ఉన్నాయి. పిడికెడు రఫూ తెగవాసులు యూరప్‌కు చెందిన రెండు గొప్ప శక్తులపై ఆధిక్యత వహించడాన్ని చూసి గర్వపడని వారెవరుంటారు? డెమాస్కస్‌లో, సిరియాలో, టర్కీలో, ఈజిప్ట్‌లో ఎక్కడ చూసినా ముస్లిములు స్వాతంత్ర్యం కోసం ప్రాణాలు అర్పిస్తూనే ఉన్నారు. అలాంటి స్వతంత్ర్య ప్రియులు ఎక్కడా కానరారు. అఫ్గనిస్తాన్‌లో కేవలం స్వాతంత్ర్యం కోసం ఎనలేని త్యాగాలు చేయడం వల్లనే ఈనాడు అక్కడ స్వేచ్ఛ కానవస్తోంది. ఇస్లాంలో సామాన్య జనాలను ఆకర్షించే శక్తి ఎంతగా ఉందో అంతటి ఆకర్షణ శక్తి మరే సమాజంలోనూ కానరాదు అని చెప్పడానికి నేను ఎంతమాత్రం సంకోచించను. నగరంలోని గొప్ప గొప్ప సంపన్నులు నమాజు కోసం నిలుచున్నప్పుడు వారు అక్కడ వరుసల్లో ఉన్న ఒక పారిశుధ్య కార్మికుని భుజంతో భుజం కలిపి నిలుచున్నప్పుడు అతని హృదయంలో ఆనంద తరంగాలు వెల్లివిరియవా? దీనికి ప్రతిగా హైందవ సమాజం ఎవరినైతే అణగారిన సమాజంగా (శూద్రులుగా) చేసివేసిందో వారిని (నీళ్ళ కోసం) బావిగట్టు దరిదాపులకు కూడా రానివ్వరు. వారిని మందిరంలోనికి అడుగు పెట్టనివ్వరు. ఈ తీరు ఇతరులను మమేకం చేసుకోవడం అటుంచి వేర్పాటుకు సంకేతం కాదా?

ప్రపంచంలో ఇస్లాంకు ప్రాప్తించిన సభ్యతా సంస్కారాలూ ఇస్లామ్ సాధించిన విజయాలు కరవాల బలంతో కాదు. అది

ఐకమత్యం కారణంగా ప్రాప్తించింది గనుకనే ఈనాడు కూడా ఆఫ్రికాలో క్రైస్తవం కంటే ఇస్లాం ప్రాభవం ముందుకు వెళుతోంది. క్రైస్తవంలో కూడా ఆకర్షించే అనేక విధానాలు ఉన్నాయి కానీ ఇస్లాంలో అత్యధికంగా కేవలం అల్లాహ్ సంస్మరణే జరుగుతోంది.

చివరగా నేను హిందువుల సంఘటన్ ప్రేమికులతోనూ, సంఘ మిత్రులతోను చెప్పదలచుకున్నదేమిటంటే ఈ విషయాల పట్ల జాతుల మధ్య ఒక గోడను నిర్మిస్తున్నారు. ముస్లిములను చెడు దృష్టితో చూడకుండా ఐకమత్యం కలిగించగలిగితే కలిగించండి. వితంతువు లకు, అనాధలకు, అంటరాని వారికి సంక్షేమం చేకూర్చగలిగితే తప్పకుండా చేకూర్చండి. కాని ఇంతవరకూ నా అనుభవాన్ని బట్టి తెలిసిందేమిటంటే నినాదాలలో ఐకమత్యం పెంపొందడం లేదు. ఇందులో నానాటికీ స్తబ్దత కనిపిస్తోంది. ఫలితంగా మనం ఇటు ఐకమత్యంగానూ ఉండలేక పోతున్నాము. అటు స్వేచ్ఛా మార్గాన పురోగమించనూ లేకపోతున్నాము. మన పరిస్థితి క్రమంగా క్షీణించి పోతోంది.

